# ఆంధ్రపత్రిక

317038



The Andhra Patrika, Madras. { Regd. No. M. 1118 Vol. 34 No. 333 SATURDAY 27th MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

## తొమ్మిది సంస్థానాల కలయికతో రాజస్థాన్ అవతరణ

### గాడ్గిల్ ప్రారంభోత్సవం: పటేలు శుభసందేశం

కోటా, మార్చి 25: రాజస్థాన్ కూటమి అనే పేరుతో దేశంలో నేడొక తృతీయ సంస్థాన కూటమి అవతరించింది. భారత ప్రభుత్వ సంస్థాన శాఖా మంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ తరఫున వర్క్సు వగైరా శాఖామంత్రి ఎన్. వి. గడ్గిలుగారు రాజస్థాన్ కూటమికి ఇవాళ ఇక్కడ ప్రారంభోత్సవం జరిపారు.

ఈ కూటమిలో ఈ క్రింది 9 రాజపుటానా సంస్థానాలు చేరినవి:— కోటా, బుండీ, డంగార్పూర్, ఝల్వార్, బనస్వార్, ప్రతాప్‌గడ్, టాంక్, కిషన్‌గడ్, షాపురా, వీటి మొత్తం జనాభా 23 లక్షల దాకా ఉంటుంది; ఆదాయం సుమారు రెండుకోట్లు. వైశాల్యం 16 వేల చదరపు మైళ్లు. రాజపుటానాలోని పెద్ద సంస్థానాలలో ఒకటైన ఉదయపూర్ కూడా రాజస్థాన్ కూటమిలో అనతికాలంలోనే చేరిపోతుందనుకుంటున్నారు. సంస్థానం చేరిక విషయమై భారత ప్రభుత్వ సంస్థాన శాఖవారితో సంభాషణలు జరుగుతున్నవి. జోద్పూర్, జయపూర్, బికనీర్‌లు కూడా క్రమేణ చేరిపోవాలి. అవి కూడా చేరిపోతే, రాజస్థాన్ కూటమి దేశంలో ఏర్పడే వివిధ సంస్థాన కూటములలోకి అగ్రస్థానం వహిస్తున్నది.

వర్క్సు శాఖామంత్రి గడ్గిల్ గారికి కోటా మహారాజా, దివాన్ యస్. సి. మెహతా ప్రభృతులు స్వాగతం ఇచ్చారు. గడ్గిల్‌గారి గౌరవార్థం సంస్థాన సేవలు స్వాగతం విన్యాసం జరిపినవి. అనంతరం గడ్గిలుగారు ఎత్తయిన రాజభవనానికి వెళ్లారు. అక్కడ కోటా రాజా గారు రాజస్థాన్ కూటమిలో చేరిన వివిధ సంస్థానాధిపతులను గడ్గిలుగారికి ఎరుకపరచారు.

పోలో మైదానంలో ఒక బ్రహ్మాండమైన జనసమూహం వీక్షిస్తుండగా కోట మహారాజాసమితి పతాకమునెగురవేసి నాటి కార్యక్రమాన్ని ఉపక్రమించారు. అనంత

(3-వ పేజీ చూడుడు)

## ఫ్రాన్సులో అంతర్జాతీయ వైజ్ఞానిక మహాసభ

### సర్ సి. వి. రామన్ ప్రయాణం

బెంగుళూరు, మార్చి 25: ఫ్రెంచి ప్రభుత్వ విద్యాశాఖవారి ఆధ్వర్యాన బూర్డోలో ఏప్రిల్ 6 న ప్రారంభం కానున్న అంతర్జాతీయ వైజ్ఞానిక సమావేశానికి హాజరవడంకోసం, సుప్రసిద్ధ భారతీయ వైజ్ఞానికుడున్నూ, నోబెల్ బహుమతి సంపాదకులున్నూ అయిన సర్ సి. వి. రామన్ గారు మార్చి 29 న బొంబాయి నుంచి విమానంమీద ఫ్రాన్సుకు బయలుదేరి వెళ్తారు. వైజ్ఞానిక శాస్త్ర పారంగతులైన 42 మంది ప్రముఖ ప్రతినిధులకు మాత్రమే ఈ సమావేశం పరిమితం చేయబడింది. ఇండియా నుంచి సర్ సి. వి. రామన్‌గారు ఒక్కరే వెళ్తున్నారు. సమావేశంలో ప్రధానంగా "రామన్ ఎఫెక్టు" గురించే చర్చ జరుగుతుంది.

"యుద్ధకాలంలో భారత దేశమందు భౌతిక శాస్త్ర పురోగమనం" అన్న విషయంమీద సర్ సి. వి. రామన్ గారు ఫ్రాన్సు వైజ్ఞానిక శాస్త్రవేత్తల సంఘం ఎదుట ఉపన్యాసం చేస్తారు.

రామన్‌గారు ఏప్రిల్ 18 న ఫ్రాన్సు నుంచి ఇంగ్లాండుకు బయలుదేరివెళ్లి ఏప్రిల్ మాసాంతానికి మళ్లీ ఇండియా తిరిగివస్తారు.

## "యూరప్ రాజ్య సమాఖ్యకు నాంది"

### 16 దేశాల సమావేశం: లియోన్ బ్లుం ప్రశంస

పారిస్, మార్చి 25: మార్షల్ పథకాన్ని వినియోగించుకొనేందుకు 16 యూరపియన్ దేశాలు జరుపుతున్న సమావేశ ఫలితాలను ప్రశంసిస్తూ "ఇది యూరపియన్ సమాఖ్యకు నాందీ ప్రస్తావన," అని ఫ్రెంచి మాజీప్రధాని లియోన్‌బ్లుం (సోషలిస్టు) ఈవేళ సోషలిస్టు పత్రిక 'లిపాప్యులేర్'లో వ్రాశాడు.

"యూరపియన్ సమాఖ్య నిర్మాణంలో తొలిఘట్టం జయప్రదంగా ముగిసింది. యూరపియన్ సమాఖ్య అంటూ యథార్థంగా ఒక రాజకీయవ్యవస్థ ఏర్పడక పోయినప్పటికీ, అదొక సజీవమై, ముందుకు పోతూవున్న ఆశయంగా వున్నది. ప్రపంచంలో అది ఒక ప్రముఖమైన ఆశయంగా పరిణమించింది. ఈ పరిణామం చాలశీఘ్రంగా సంభవించినది." అని బ్లుం వ్రాశాడు. (ఎ. యు. పి.)

## జార్జి మార్షల్‌స్థానే జేమ్సు ఫారెస్టాల్?

బెర్లిన్, మార్చి 25: అమెరికా విదేశాంగమంత్రి జార్జిమార్షల్, నవంబర్లో అమెరికా అధ్యక్షపదవికి ఎన్నికలు జరగటానికి ముందుగా రాజీనామా ఇస్తాడనీ, ప్రస్తుత రక్షణమంత్రి జేమ్సు ఫారెస్టాల్‌కి ఆపదవి ఇవ్వాలని అమెరికా ప్రభుత్వం ఆలోచిస్తున్నదనీ, బెర్లిన్ పత్రిక "నేషనల్ జైటంగ్" ఈవేళ ప్రకటించింది. ఈపత్రిక ప్రచురణకు రష్యన్లు ఆమోదించారు.

## మళ్లీ వెనుకటి మంత్రివర్గమే

### 28 వోట్లతో రామస్వామిరెడ్డియార్ ఎన్నిక

చెన్నపురి, మార్చి 26: రాష్ట్ర శాసనసభ కాంగ్రెసు పక్షమునకు 1948-49 సంవత్సరానికి శ్రీ వోమందూరు రామస్వామిరెడ్డియార్ ఎన్నికైనారు. వీరికి 112, ప్రకాశంగారికి 84 వోట్లు వచ్చినవి.

నిన్న సాయంత్రం సరిగ్గా 5 గంటలకు ఓమందూరు రామస్వామి రెడ్డియారు అధ్యక్షతన బాంక్వెటింగ్ హాలులో, నాయకుని ఎన్నికొనేనిమిత్తం సమావేశమైనది. ప్రస్తుత ప్రధానమంత్రి ఓమందూరి రామస్వామి రెడ్డిగారు, మాజీ ప్రధానమంత్రి టంగుటూరు ప్రకాశం పంతులు గారు నాయకత్వానికి పోటీ చేశారు.

ఓమందూరి రామస్వామి రెడ్డిగారి పేరును, డా॥ టి. యస్. యస్. రాజన్ గారు ప్రతిపాదించగా, కన్నియప్పన్ గారు బలపరిచారు. శ్రీ ప్రకాశం పంతులుగారి పేరును, స్వామినాథన్ గారు ప్రతిపాదించగా తెన్నేటి విశ్వనాథంగారు బలపర్చిరి.

## "జాతీయ వారం: మత సామరస్యం"

### రాజేంద్రబాబు ప్రకటన

వార్ధాగంజ్, మార్చి 25: "ఈ సంవత్సరపు జాతీయవార మహోత్సవాలను వివిధ మతవర్గాల మధ్య సామరస్యం పెంపొందించటానికి, గాంధీ స్మారకనిధికి విరాళములను ప్రోగుచేయటానికి వినియోగించవలె"నని కాంగ్రెస్ అధ్యక్షుడు బాబూ రాజేంద్ర ప్రసాదు గారు నేడొక ప్రకటన చేశారు.

"ఉత్సవాలు ఏప్రిల్ 6 వ తేదీన ప్రారంభమై, 13 వ తేదీతో అంతమౌతాయి. వీనిని మనం దాదాపు 30 ఏళ్ల నుంచీ ఆచరిస్తూ వచ్చాము. ఈ వారంలోనే మహాత్మాగాంధీ, ధర్మంకొరకు, స్వాతంత్ర్యంకొఱకు, ఆత్మ గౌరవంకొఱకు పెద్దయెత్తున ప్రజా శాసనోల్లంఘనలో ప్రచారం మొదలిడినాడు. ఇంతవరకూ వీనిని మనం నిర్మాణ కార్యక్రమంకోసం వినియోగిస్తున్నాము.

ఈ సంవత్సరం మనం మత సామరస్యం కొఱకు ఈ వారంలో బహుధా ప్రచారం చెయ్యాలి.

## ఐక్యరాజ్యసమితి ప్రతిష్ఠ దెబ్బతిన్నది

### దీనికి కారణం అగ్రరాజ్యాలేనని ట్రిగ్వేలీ ప్రకటన

లేక్‌సక్సెస్, మార్చి 25: ఐక్యరాజ్యసమితి ప్రతిష్ఠ బాగా దెబ్బతిన్నది. ఈ నష్టసత్యాల్ని కప్పిపుచ్చడానికి వీల్లేదు. దీనికి కారణం అగ్రరాజ్య పంచకమే" అని సమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ ఇవ్వాళ పత్రికావిలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ అన్నారు. అగ్రరాజ్య పంచకం పరస్పరం కలసి పనిచేయగలవనే ఆశతోనే, సమితి యేర్పడిందని, ఇప్పటికైనా అగ్రరాజ్యాలు తామూ కలసి మెలసి పనిచేయకల మార్గాన్ని, అన్వేషించుకోవాలని ట్రిగ్వేలీ సూచించాడు.

### జెకోస్లవేకియా ఎన్నికలు

ప్రేగ్, మార్చి 25: మే 23 వ తేదీ ఆదివారం నాడు జెకోస్లవేకియా పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతవని ఈవేళ జెక్ ప్రభుత్వం ప్రకటించింది.

## ఇండియా జెకోస్లావేకియా వ్యాపారాభివృద్ధి అవకాశాలు

### నెహ్రూ ప్రజాస్వామ్య దృక్పథాన్ని అభినందిస్తూ లండన్‌లోని జెక్ అధికారి ప్రకటన

లండన్, మార్చి 25: 1938 సంవత్సరములో మ్యూనిక్ ఒడంబడిక సమయమున పండిత జవహర్లాల్ నెహ్రూగారు మా దేశము వచ్చినని, జకోస్లావేకియా స్వాతంత్ర్య సంరంభమును సమర్థించుచు చిన్న పుస్తకము వ్రాసెనని మే మెన్నటికిని మరువజాలము. అప్పుడు మా పక్షము వహించి పనిచేయు మిత్రులు బహు కొద్దిగా నుండిరి. పండిత నెహ్రూగారు ప్రజాస్వామ్యమునకు, న్యాయధర్మములకు నిర్భయముగా నడుముకట్టి నిలచినందుకు మే మెంతయు కృతజ్ఞులము' అని లండన్‌నందలి జెక్ రాయబారవర్గ ప్రథమ కార్యదర్శి డా॥ కావన్ గారు నేడు భారత పత్రికారచయితల సంఘములో ప్రసంగించుచు చెప్పిరి.

జకోస్లావేకియా విదేశీయుల ఆక్రమణకు, పీడనమునకు లోనైయుండుటచే భారతీయుల భావములను, ఆశయములను, జకోస్లావేకియా ప్రజలు అర్థముచేసికొనగలరని డా॥ కావన్‌గారనిరి. ఇండియా జకోస్లావేకియాల మధ్య వాణిజ్యము హెచ్చుగా జరుగు అవకాశములను గూర్చి అతను ప్రస్తావించుచు యిట్లనెను "కొన్ని, జనపనార, మున్నగు భారతీయ వస్తువులకు మారుగా మాదేశము భారతదేశమునకు వ్యావసాయిక యంత్రములను, ఇతర యంత్రములను సరఫరా చేయగలము. డాలర్లలోను, ఇతర విదేశీయ చలామణి నాణెములలోను ప్రమేయం లేకుండా వాణిజ్యమును వస్తుమార్పిడి పద్ధతిపై జరుపవచ్చును. జకోస్లావేకియాలో విద్యనభ్యసించు విద్యార్థుల సంఖ్యను హెచ్చించవలయును. మా దేశమునందలి పాఠశాలలలోను, విశ్వవిద్యాలయములలోను విదేశీయ విద్యార్థులు పైకము నిర్నిరోధముగా విద్యాభ్యాసము గావింపవచ్చును. జీవితమునకు కావలసిన ఖర్చును మాత్రమే వారు భరించవలసి యుండును. ఈ ఖర్చులు చాలా తక్కువ. భారత విద్యార్థులు ఢిల్లీ లేక లండనునందలి జెక్ రాయబారవర్గ కార్యాలయములకు వ్రాసి సంగతులు తెలిసికొనవచ్చును. లేదా ప్రాగ్‌నందలి విద్యాశాఖవారికి వ్రాయ

(2-వ పేజీ చూడుడు)

## "రష్యా ఎంత ప్రయత్నించినా బెర్లిన్ నగరాన్ని విడిచిపెట్టం"

### అమెరికా విదేశమంత్రి మార్షలు స్పష్టీకరణ

వాషింగ్టన్, మార్చి 25: "బెర్లిన్ నగరంలో సంయుక్త పాలక సంఘాన్ని భగ్నం చేయటానికి రష్యనులు ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నా, అమెరికా ఆనగరాన్ని విడిచిపెట్టదు," అని అమెరికా విదేశాంగమంత్రి జార్జిమార్షల్ ఈవేళ ఇక్కడ ఉద్ఘాటించాడు.

### బెర్లిన్‌పత్రిక హెచ్చరిక

బెర్లిన్, మార్చి 25: "బెర్లిన్ నగరం నుండి అమెరికన్, బ్రిటిషు, ఫ్రెంచిసైన్యాలు, మూటముల్లె సర్దుకుని వెళ్లటానికి ఇంక ఎక్కువరోజులు పట్టదని అందరూ గ్రహించే వుంటారు. పాశ్చాత్యరాజ్యాల సేనానులు తరుచుగా చేస్తున్న విరుద్ధ ప్రసంగాలు ఈ ఊహను బలపరుస్తూ, ఆరాజ్యాల వైఖరి, న్యాయరీత్యా, యదార్థ పరిస్థితులనుబట్టి, సమర్థనీయంకాదని నిరూపిస్తున్నవి." అని సోవియట్ ఆమోదంతో నడుస్తున్న 'బెర్లినర్ జైటుంగ్' పత్రిక వ్రాస్తున్నది. ఈపత్రిక సోషలిస్టు సమైక్యతపక్షంవారిది. ఈ పక్షానికి సోవియట్ల సానుభూతి వున్నది.

### యుద్ధం ఇప్పటిలో రాదని లూసియెస్‌క్లె

ఫ్రాంక్‌ఫర్టు, మార్చి 25: జర్మనీలో అమెరికా ఆక్రమణప్రాంత మిలిటరీ గవర్నరు జనరల్ లూసియస్‌క్లే, యీవేళ ఇక్కడ మాట్లాడుతూ, "ప్రస్తుతం బెర్లిన్లో తూర్పు, పశ్చిమ పక్షాలకు ఏర్పడిన ప్రతిష్ఠంభనవల్ల త్వరలోనే సైనిక సంఘర్షణ వస్తుందని అనుకోను. ప్రస్తుత ప్రతిష్ఠంభన రాజకీయాలకు సంబంధించినదేకాని సైనిక సమస్యకాదు." అని అన్నాడు.

### అగ్రరాజ్యాల విభేదాలు

సంయుక్తపాలకసంస్థ సమావేశంలో నుండి రష్యా నిష్క్రమించిన అంశాన్ని గురించి మాట్లాడుతూ, "దానికి అనవసర ప్రాధాన్యతను ఇస్తున్నారు. పరిస్థితులు విశదమయేవరకూ ఓపిక పట్టటం మంచిది" అని అన్నాడు. ఆ చర్యకు రష్యన్ల అంతరంగం నిర్ధారణ్ని తెలియచేస్తుందా అని పశ్చిమ రాజ్యాలు అడిగిన ప్రశ్నకు జవాబు వచ్చిందా అని అడగ్గా ఇంకా రాలేదని జవాబిచ్చాడు.

(2 వ పేజి చూడుడు)

## ఇండియాకు 2½ కోట్ల డాలర్ అమ్మకం

### అంతర్జాతీయ ద్రవ్యనిధి సహాయం

వాషింగ్టన్, మార్చి 26: అంతర్జాతీయ ద్రవ్యనిధి ఇండియాకు రెండున్నరకోట్ల డాలర్లను రూపాయలకు బదులుగా అమ్మటానికి ఇచ్చింది. డాలర్ ఒకటికి 3-1/3 రూపాయల చొప్పున నిధి మార్చుకున్నది. అమెరికాలో చేసిన వ్యాపారంలో 1947 లో 20 కోట్ల డాలర్లు ఇండియాకు తరుగుపడినవి. యంత్రాలు, పెట్రోలు, ధాన్యం, మొదలైనవాటికి ఇండియా అమెరికావద్ద కొన్నది.

## "అమెరికా తీరంలో అన్యరాజ్య జలాంతర్గాముల సంచారం"

### ఏ దేశానివో తెలియదని నౌకామంత్రి ప్రకటన

వాషింగ్టన్, మార్చి 25: అమెరికా తీరాలకు కొంతదూరంగా, ఏ దేశపువానివో తెలియని జలాంతర్గాములు కన్పించాయని నౌకాశాఖమంత్రి జాన్ సల్లివాన్ నేడు సెనేట్ సభ్యులకు తెలియజేశాడు. అవి పశ్చిమయూరప్‌కు మాత్రం చెందినవికావని అతడు దృఢంగా చెప్పాడు.

కార్యదర్శి సల్లివాన్ అవి ఏ దేశానివో స్పష్టంగా చెప్పలేదు. కాని తూర్పు యూరప్ రాజ్యాలలో రష్యాకు తప్ప మరెవరికీ జలాంతర్గాములు లేవు.

"నేను ఈవిషయంపైఏమీ వ్యాఖ్యానం చేయదలచుకోలేదు. కాని 1917 లోనూ 1941 లోనూ యుద్ధానికి ముందు సూచనగా జర్మనులు కూడా యిదేవిధంగా మన తీరాలకు జలాంతర్గాములను రహస్యంగా పంపారని మీకు గుర్తుచేస్తున్నాను. అని కూడా సల్లివాన్ అన్నాడు.

## ఈ ఏడాదికి అమెరికా సైనిక వ్యయం 1400 కోట్ల డాలర్లు

వాషింగ్టన్, మార్చి 25: అమెరికా రక్షణ మంత్రి జేమ్సు ఫారెస్టాల్, ఈవేళ అమెరికన్ కాంగ్రెసులో 1948-49 సంవత్సరాని సైనిక బడ్జెట్‌ను ప్రతిపాదిస్తూ ఈ ఏడాదికి సైనిక శాఖలకు 1400 కోట్ల డాలర్లు అవసరమవుతున్నాడు. ఈఅంచనా సనక ట్రూమన్ కోరినదానికన్నా 300 కోట్ల డాలర్లు ఎక్కువ. ఈ బడ్జెట్ విషయమై అమెరికన్ సెనేట్ యొక్క సైనిక వ్యవహారాల సంఘం ముందు వాదిస్తూ అతడు రష్యాను అతి తీవ్రంగా నిందించాడు.

"రష్యా యూరపు దేశాల స్వాతంత్ర్యాన్ని అణచివెయ్యాలని ప్రయత్నిస్తున్నది. హంగరీ, జకోస్లావేకియాలలో కమ్యూనిస్టు విప్లవాలను తెచ్చింది, ఫిన్లండు, స్కాండినేవియన్ దేశాలను రష్యా భయపెడుతున్నది" అని ఫారెస్టాల్ అన్నాడు.

### బడ్జెట్ వివరాలు

జేమ్సు ఫారెస్టాల్ బడ్జెట్‌లో ఈ కింది వ్యయాన్ని కోరాడు:

(1) 1948-49 సం॥కి సైనిక శాఖల కింద 1400 కోట్ల డాలర్లను వినియోగించాలి

(2) 19 25 సం॥ల మధ్య వున్నవారిని సైన్యంలో వివిధ శాఖలలోనూ జేర్చుకుని సైనికబలాన్ని 18,92,000నుండి17,32,000 కు పెంచే అధికారం.

(3) అన్ని పరిస్థితులకూ ఉపయోగపడేట్లుగా 40 కోట్ల డాలర్లు ఖర్చుపెట్టి సార్వజనీన సైనికశిక్షణను ప్రవేశపెట్టే అధికారం. (ఎ. యు. పి.)

## గంటాల పంచాంగం

సర్వజిత్ నంః ఫాల్గున బ॥ తృతీయ 1948 నంః మార్చి 27 శనివారం
శ్రీ తృతీయ రా 1-57 స్వా రా 2-1 వర్జ్యం వ 8-19 ల 9-51 వ.

బ॥ చతుర్థి మార్చి 28 ఆదివారం
ఆశ్ చవితి రా 1-5 విశా రా 1-50 వర్జ్యం ఉ 7-35 ల 9-10 వ.

ఆంధ్రపత్రిక
సర్వజిత్ నంః ఫాల్గున బ॥ తృతీయ
శనివారము

## రాష్ట్ర ఆదాయములు

అసెంబ్లీ బడ్జెటు చర్చ ముగిసిన అనంతరము, ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు ఉభయ శాసనసభాసభ్యులను ఆహ్వానించి రాష్ట్ర రాబడి ఎక్కువ యగుటకు గాను మార్గములనాలోచింపవలసి నదని కోరుట ఉచితముగనున్నది. కేవలము శాసనసభలందు బడ్జెటు ప్రతిపాదింపబడిన పుడు సంవత్సరమున కొకసారి రాష్ట్ర ఖజానాస్థితిని గురించి చర్చలు విమర్శలు చేయుటగాక, తరుచు ఆ విషయముల గురించి శాసన సభ్యులు పరిశీలన చర్చలు జరుపుచుండుట అవసరము. అది ప్రజలకు కూడ ఉపయోగముగనుండగలదు. ఖజానా వ్యవహారములు అతి క్లిష్టమైనవనీ, దానిని ఆకళింపు చేసికొనుట కష్టమని సామాన్యాభిప్రాయము. తమకు స్వంత ఖజానాసమస్యలు బాగా అర్థమగును గాని, రాష్ట్ర ఖజానా వ్యవహారములు ఒక పట్టున బోధపడవని గవర్నరు నర్ నైగారు హాస్యముగ చెప్పిరి. వాస్తవమునకు ఈ రెంటి సూత్రములు ఒకటే నని చెప్పవచ్చును.

పాత కొత్త రాజ్యాంగముల ననుసరించి నిర్మాణకార్యక్రమ భారము రాష్ట్రములపైననే యుండగలదు. భారత బడ్జటు చర్చకు సమాధానమిచ్చుచూ భారత ఖజానామంత్రి షణ్ముగం శెట్టిగారు ఈ విధముగ చెప్పిరి. "నూతన రాజ్యాంగ నిర్మాతలు పెడరలు విధానమునే అనుసరింప దలచినట్లు వ్యక్తమగుచున్నది. అందువల్ల ప్రజలకు ప్రత్యక్షముగా ఉపయోగకరమగు కార్యములన్నిటినీ రాష్ట్రప్రభుత్వములే నిర్వహించవలసి యుండును." "రాష్ట్రములే నిర్మాణ కార్యముల భారము వహించవలసి యున్న"దని శ్రీ గోపాలరెడ్డిగారు కూడ చెప్పిరి. కాబట్టి ఈ అవసరములకు తగినట్లుగా రాష్ట్ర ఆదాయము పెరుగునట్లు చూడవలసియున్నది కేవలము శాంతి, భద్రతలను కాపాడుటే ప్రభుత్వ ప్రధాన ధర్మముగా పూర్వము ఎంచబడుచూ వచ్చెను. కాని ఇపుడు ప్రాథమిక ప్రజావసరము లన్నిటినీ తృప్తిపరచు బాధ్యతను ప్రభుత్వము వహించవలసి యున్నది. ఆర్థిక ప్రయోజనమునే గాక, నైతిక సంస్కృతిని కూడ దృష్టికి తీసికొని రావలసియున్నది.

ప్రభుత్వమునకు సాధారణముగా ఆదాయము ప్రత్యక్షముగనో, పరోక్షముగనో పన్నుల రూపమునందే రాగలదు. ఒక పన్ను మూలమున రాబడి తగ్గినపుడు మరొక పన్నును విధించి, ఆ లోటును భర్తీచేసికొనవలసి యుండును. మద్యనిషేధమువల్ల పోయిన రాబడిని అమ్మకపుపన్ను ద్వారా రాబట్టుకొనుట అందరికీ నిత్యానుభవము. భూమిశిస్తు రాష్ట్ర ప్రభుత్వమునకు ప్రధాన ఆదాయము. రేపు దానిని కూడ సంస్కరింప దలచిరి. జమీందారీ విధానము రద్దుకానున్నది దీనివల్ల ఆదాయము పెరుగునని కొందరు, తగ్గునని కొందరు వాదించుచున్నారు. అదేవిధముగ వ్యవసాయ ఆదాయపుపన్ను గురించి కూడ అభిప్రాయభేదములున్నవి. కొంత భూ పరిమితికి శిస్తునుంచి, ఆ పైబడినవాటికే వ్యవసాయ ఆదాయపు పన్నును మాత్రము విధించుటమూలమున పట్టాదార్లు చిన్నభాగములుగా విడిపోవుదురనీ, మరికొద్దిభూమికి పన్ను ఉండదనిన, అందుకు తగినట్లుగా భూ పంపకము చేసికొనుట జరిగి, ప్రభుత్వమునకు ఇపుడున్న రాబడి తగ్గిపోగలదను అభిప్రాయము కలదు. ప్రజాసౌకర్య కార్యక్రమము చూచిన ఖర్చు కను పెరగగలదు. కాబట్టి దీనిని గమనించి ఆదాయమునకు ఆధారములను చూడవలసియున్నది.

ఈ సందర్భమున ప్రథమముగా కనుపడునది కేంద్రప్రభుత్వమునుండి రాగల సహాయము. ఆదాయపుపన్నునుండి కేంద్రప్రభుత్వము కేటాయించినది తృప్తికరముగ లేదని రాష్ట్రఖజానామంత్రి గోపాలరెడ్డిగారనిరి. ఇతర ఎక్సైజు పన్నుల పంపకముకూడ అంత ప్రోత్సాహకరముగ లేదనిరి. మరణ సుంకము పన్ను అమలు జరిగినప్పుడు దానివల్ల ఎంత రాగలదో తెలియదు. నిర్మాణ కార్యక్రమానికి కేంద్ర ప్రభుత్వము ఇవ్వదలచిన గ్రాంటులకు కొన్నిషరతు లున్నవి. కేంద్ర ప్రభుత్వ మెంత ఇవ్వదలచినదో రాష్ట్రప్రభుత్వము కూడ అంత మొత్తము చూపినగాని ఆ మొత్తము చేతికి రాదు. పరిషత్తు రాజ్యాంగ నిర్మాణ సంఘము రాష్ట్రములకు నూతన ఆదాయమిచ్చు ఆధారములను చూపలేదు. అయిదు సంవత్సరముల అనంతరము ఆ విషయమును గురించి ఒక కమీషను విచారణ చేయు ననిరి. రాష్ట్రములకు ఏ శాసననిర్మాణాధికార ముండవలెననునది తేల్చుటకు పండిత నెహ్రూ అధ్యక్షత క్రింద ఒక కమిటీ ఏర్పరుపబడినది. అందువల్ల నూతనరాజ్యాంగ రూపము పూర్తిగ తేలువరకు రాష్ట్ర ప్రభుత్వ ఆదాయశక్తి పూర్తిగ ఆకళింపు జేసికొనుటకు వీలుండదు. అంతవరకు రాష్ట్ర ఖజానా వ్యవహారములను జాగ్రత్తగ గమనించవలసి యుండును. కాని ఈ లోపల ఆదాయము పెరుగుటకు కేంద్ర ప్రభుత్వము వసూలు చేయు సుంకములనుండి ఎక్కువ భాగము పొందుటకు ప్రయత్నించి, ప్రభుత్వమే ప్రజోపయోగ వ్యాపారముల నడుపుటకు ప్రయత్నించవలసియున్నది. మోటారురవాణా సర్వీసులను ప్రభుత్వము నిర్వహించవలెనను దానిననుసరించి చేయున్నది. రాష్ట్రఖజానా వ్యవహారములగూర్చి ప్రసంగించుచూ "ప్రభుత్వము స్వయంగా నిర్వహింప పూనుకొనెడి వ్యాపారసంస్థల మూలముననే ఎక్కువ ఆదాయము రావలసి యున్నది." అని డా॥ నారాయణస్వామినాయుడుగారు తెలిపిరి. ఆర్థిక విషయములందు కేంద్ర, రాష్ట్రప్రభుత్వముల బాధ్యతలను ఈ నెల 18 న భారత ఖజానా సభ్యుడు సుస్పష్టముగ వివరించిరి. దేశరక్షణ బాధ్యతవహించుటకు దేశ ఆర్థిక ఖజానా వ్యవహారములు సక్రమముగ నడపి కేంద్రమునుండిగాని లేక ప్రత్యక్షముగా ప్రజలనుండిగాని రాష్ట్రములు ఆదాయమును పొందునట్లు చేయుటకు తగినట్లు కేంద్రప్రభుత్వము బలీయముగానుండవలెను.

## పాకిస్థాన్‌తో పశ్చిమ పంజాబు ప్రధాని అభిప్రాయ భేదాలు

లాహోర్, మార్చి 25: నేను పశ్చిమ పంజాబు శాసనసభలో కాంగ్రెసుల పునరుద్ధరణ తీర్మానంమీద ప్రతిపాదించబడిన కొత్త తీర్మానంపై ప్రధాన మంత్రి మాందోట్ నవాబు ఉపన్యసిస్తూ, పాకిస్తాన్ పంజాబు సంయుక్త కాంగ్రెస్ పునరుద్ధరణ సంఘంనుండి తాను త్వరలోనే రాజీనామా ఇవ్వబోతున్నట్లు ప్రకటించాడు. తన కూ పాకిస్తాన్ పునరుద్ధరణ శాఖా మంత్రికీ వచ్చిన అభిప్రాయ భేదాలగురించి ప్రస్తావిస్తూ, రాష్ట్ర వ్యవహారాలలో కేంద్ర ప్రభుత్వ మంత్రులు జోక్యం కల్పించుకొంటే దం తాను సహించబోనని అన్నాడు.

"సంయుక్త కాంగ్రెస్ పునరుద్ధరణ సంఘం ఏర్పాటు చేయ వద్దని నేను మొదట్లోనే చెప్పాను. కేవలం పునరుద్ధరణ విధానాన్ని నిర్వచించడం మాత్రమే సంయుక్త సంఘం కర్తవ్యమనీ, దానిని అమలులో పెట్టే అధికారం యావత్తూ రాష్ట్ర ప్రభుత్వాల చేతుల్లో నే ఉంటుందనీ, శ్రీ గ్లాన్సీగారు హామీ ఇచ్చిన మీదటే ఈ సంఘాన్ని స్థాపించడానికి నేను అంగీకరించాను. కాని సంఘం ఈ ఒడంబడికకు విరుద్ధంగా అనేక పర్యాయాలు హద్దుమీరి ప్రవర్తించింది. పాకిస్తాన్ కాంగ్రెస్ మంత్రి మామూలు పర్యాదలనుకూడా పాటించకుండా, రాష్ట్రప్రభుత్వం పరోక్షంలోనే రాష్ట్రంలో డిప్యూటీకమీషనర్లను కలుసుకొని సమావేశపరచాడు. సంయుక్త సంఘ సమావేశాలకు కొన్నిటికి పని ఒత్తిడివల్ల నేను వెళ్లలేకపోయినప్పుడు, నాతో నిమిత్తం లేకుండానే అనేక ప్రధాన విషయాలపై నిర్ణయాలు చేశారు.

ఈ వివాదము పాకిస్తాన్ కాంగ్రెస్ మంత్రి అనవసరంగా రచ్చ కీడ్చినందుకు నేను చాలా విచారిస్తున్నాను. నాది సంకుచితదృష్టి అనీ, సాహసం లేనివాడిననీ, ఆయన బహిరంగంగా నిందించాడు. ఆయన చేసిన ఆరోపణలు అన్నీ నాకన్న ఆయనకే ఎక్కువగా వర్తిస్తవనడం సత్యదూరంకాదు పంజాబుకు కాంగ్రెస్ పునరుద్ధరణభారాన్ని వహించడంలో తోడ్పడుతానని సింధువాగ్దానం చేసింది సింధు రాష్ట్రంచేత ఈ వాగ్దానాన్ని నెరవేర్చేట్లు పాకిస్తాన్ ప్రభుత్వం చెయ్యాలి" మియాన్ ఇఫ్తికారుద్దీన్ మంత్రివర్గంమీద చేసిన విమర్శలకు సమాధానమిస్తూ ప్రధానమంత్రి ఇలా అన్నాడు: "మియా సాహెబుగారు తమ రాజకీయ ఆసెంబ్లీ కమిటీలో బహిరంగంగా నిర్వచించి ముస్లింలీగు కౌన్సిలు నాటిని ఎంతవరకు సమర్థిస్తు దో విశ్వాస తీర్మానంద్వారా తెలుసుకోడం మంచిది. మేము శాసనసభ్యుల విశ్వాసం కోల్పోయి నామని రుజువైతే, మరుక్షణమే అధికారంలోంచి తొలగిపోవడానికి సిద్ధంగా ఉన్నాము." కోశ తీర్మానం వోటుకు పెట్టగా వీగిపోయింది.

అనంతరం బడ్జటుపై జరిగిన చర్చకు ఆర్థికమంత్రి డా॥ ఖాజా సమాధానమిస్తూ, రాష్ట్రంలో చేనేత కార్ఖానాలయాలను స్థాపించడానికి బడ్జెటులో కోటిరూపాయలు ప్రత్యేకించబడినవనీ, ఖద్దరు ఉత్పత్తిని ప్రోత్సహించడానికి సహకారశాఖ వారు లక్షలాది రూపాయలను పంపకంచేస్తారనీ అన్నాడు. దీర్ఘకాలం వ్యాధితో తీసుకొని నిన్న మరణించిన డెప్యూటీస్పీకర్ ఫజల్ ఇలాహీ గౌరవార్థం సభ మధ్యాహ్నం 10 నిముషాలసేపు వాయిదా వేయబడింది.

## ఎన్నికలలో గెలుపు తనదేనని ట్రూమన్ ఆశ

వాషింగ్టన్, మార్చి 25: వచ్చేనవంబరులో, అమెరికన్ అధ్యక్షపదవికి జరిగే ఎన్నికలలో, డెమోక్రాట్ల కక్షేవారే గెలుస్తారని ట్రూమన్ ఆశిస్తున్నాడు

తాను మళ్లీ అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలవడానికి అమెరికన్లు తీవ్రంగా ప్రతికూలత చూపెడుతున్నారని ఒక విలేఖరి వ్రాయడం తానేమీ ఆందోళన కరంగా లేదని ట్రూమన్ అన్నాడు.

"అధ్యక్షుడను (తాను) ఆసాంతం వరకు పోరాడటానికే, స్వేయించుకొన్నాడని సెనెటర్ కారల్ హేచ్, కొద్ది రోజులక్రితం తనను గురించి చెప్పిన విషయం చాలా సముచితంగా ఉన్నది" అని ట్రూమన్ అన్నాడు.

## "ఈ మంత్రివర్గమే ఖాయం" సుబ్బరాయన్ గారి వైఖరి మార్పు

ఈ రోజు (శుక్రవారం) సాయంత్రం 5-30 కు కాంగ్రెసు శాసనసభా పక్షం శ్రీ ఓమండూరు రామస్వామి రెడ్డియార్ అధ్యక్షతన సమావేశమై వచ్చే సంవత్సరానికి నాయకుని ఎన్నుకుంటుంది. ఈ సమావేశానికి ఎవరు అధ్యక్షత వహించాలనే అతి మామూలు విషయం మీదనే ఈ పూట తర్జనభర్జన జరిగిందంటే పక్షాలు ఎంత తీవ్రంగా తమ నాయకుని కోసరం పనిచేస్తూ ఉన్నదీ స్పష్టమౌతుంది. ఎవరికైనా తెలుసుండి రామస్వామి రెడ్డియార్ గారే అధ్యక్షత వహిస్తారని అయినా వోట్లు గట్టిగా ఉంటే అధ్యక్షస్థానంలో ఎవరు కూర్చుంటే నేం? ప్రకాశంగారి మొదటి ఎన్నిక విజయానికి ఆ సమావేశానికి అధ్యక్షత వహించిన వారి చాతుర్యమే కారణమై ఉన్నందువల్ల ఇప్పుడే మీమాంస వచ్చి ఉండవచ్చు. పైగా తెల్లవారే సరికి పరిస్థితులు పూర్తిగా మారిపోయినవనీ ఇప్పటి మంత్రివర్గానికే అంతా సముఖంగా ఉండనీ అంటున్నారు.

రాత్రి "రాజాజీ గ్రూపు" వైద్యనాథయ్యర్ గారి అధ్యక్షతన సమావేశమై నాయకత్వం ఎన్నికలో తమ వైఖరిని గురించి అరమరలేకుండా చర్చించుకున్నారు. 27 మంది సభ్యులు హాజరైనారు. అందులో నలుగురుమాత్రం రామస్వామి రెడ్డియార్ గారి నాయకత్వమే ఉండాలని వాదించారు. మంత్రుల ప్రవర్తనను తీవ్రంగా విమర్శించినవారికి రాజన్ గారు సమాధానం చెప్పారు. సుబ్బరాయన్ గారు అతః పూర్వం ప్రచారమైన వదంతులను విరుద్ధంగా తాను ఇప్పటి మంత్రివర్గంతోనే ఉంటానని చెప్పినందున పరిస్థితులన్నీ మారిపోయినవనీ ఇంక "రాజాజీ గ్రూపు" అంటూ వ్యవహరించడం అనుచితమని చెప్పి ఈ గ్రూపుకు చెందినవారందరూ ఎవరిష్టం వచ్చినట్లు వారు వోటుచేయడం ఉచితం అని శ్రీ వైద్యనాథ అయ్యర్ ప్రకటించగా సభ్యు లందరూ అంగీకరించారు. అదిలో "రాజాజీ గ్రూపు" ఏకంగా 30 మంది తమ పక్షాన వస్తారని ప్రకాశం పంతులు గారి పక్షీయులు ఆశించారు. తమిళులలో ప్రకాశంగారికి వోట్లు ఇచ్చేవారు 15-20 మంది ఉంటారనీ, తెనుగువారు 50 మందీ మరొక 40-50 మంది చేరితే ప్రకాశంగారికి ఖాయంగా గెలుపు లభిస్తుందనీ అనుకున్నారు. గతరాత్రి "రాజాజీ గ్రూపు" రద్దుకావడంతో, సుబ్బరాయన గారి వైఖరి మార్పుతో విజయావకాశాలు కొంత సన్నగిల్లిపోయినట్లు నిన్న సాయంకాలం వరకూ ధైర్యంగా ఉన్న ప్రకాశం పంతులుగారి అనుయాయులు ఆందోళన చెందుతున్నారు. పైగా సుబ్బరాయన్ గారితో ప్రకాశం గారు చెన్నపట్నం గురించీ, సుశములంటి ఉద్యోగాలివ్వడం గురించి రాజీపడినారని తెలిసి కొందరు. తెనుగు వారే ఈ ఒడంబడిక గురించి అనేక సందేహాలను వెల్లడిస్తూ ప్రకాశంగారి నాయకత్వంకల్ల చెన్నపట్నం ఇప్పుడే తమిళులకు సంక్రమించిపోతుందేమో అని భయపడుతున్నారు. రాజీగాని, ఒడంబడికగాని ఏమీ లేదన్న శ్రీ వైద్యనాథ అయ్యర్ గారు గత రాత్రిచేసిన ఉపన్యాసంబట్టి ప్రకాశంగారు సుబ్బరాయన్ గారితో సమాధానం కుదుర్చుకున్నట్లు స్పష్టమైంది. "ప్రకాశంగారి నాయకత్వం ఆంధ్రనాయకత్వం." అనే నినాదానికి కొంతబలం తగ్గినట్లు కన్పిస్తున్నది

ఈ రోజు ఉదయం కూడా సుబ్బరాయన్ గారు ప్రకాశంగారిని కలుసుకొని మాట్లాడారు. ఈ సమావేశాన్ని ఎవరెట్లా సంభవించినట్లు వారు వ్యాఖ్యానిస్తున్నారు. గతరాత్రి జరిగిన దానివల్ల తనపై ఒకేమీ మారలేదనీ, తాను ప్రకాశంగారితోనే ఉంటాననీ సుబ్బరాయన్ గారు చెప్పి వర్తమాన మంత్రివర్గ ప్రతికూలురంటున్నారు. మంత్రివర్గం వారి వ్యాఖ్యానం ఇందుకు పూర్తిగా విరుద్ధంగా ఉంది "గత రాత్రి రామస్వామిరెడ్డియార్ గారి బంగళాలో మంత్రులందరూ సమావేశమైనారు. పరిస్థితులను సింహావలోకనంచేసి అందరూ కలిసికట్టుగా ఉండటానికి నిశ్చయించుకున్నారు సుబ్బరాయన్ గారు యథాస్థితికి కట్టుబడివుండటానికే తీర్మానించుకున్నారు. ఆ విషయం ప్రకాశంగారికి చెప్పారు. అందుచేతనే ప్రకాశంగారి అనుయాయులు ఎక్కువగా ఆందోళన చెందుతున్నారు. రామస్వామిరెడ్డియార్ నాయకత్వానికి ఢోకాపోయినా ఇప్పటి మంత్రివర్గానికే మెజారిటీ ఉంటుంది" అని అంటున్నారు.

కాన్వాసింగ్ మాత్రం చాలా ముమ్మరంగా సాగుతున్నది. ఎవరు గెల్చినా 5, 10 వోట్లు కంటే ఎక్కువ తేడా ఉండదు అనీ, తమ మంత్రివర్గానికి 110 దాకా గెలుపు అని మంత్రులు సన్నిహితంగా చెప్తున్నారు.

తెనుగుజిల్లాలనుంచి ఇప్పటికే 2 వేల మంది వచ్చారు కాంగ్రెస్ మీటింగ్ హాల్ అపరనిండిపోయింది.

## సర్వోదయ సమాజానికి కమిటీ నియామకం

### రాజేన్‌బాబు ప్రకటన

వార్ధా, మార్చి 26: ఇటీవల వార్ధాలో జరిగిన నిర్మాణాత్మక కార్యకర్తల సమావేశం తమకు ఇచ్చిన అధికారాన్ని పురస్కరించుకొని రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్, కిశోరీలాల్ మష్రువాలాగారలు "సర్వోదయ సమాజానికి" ఈ క్రింది వారిని కమిటీ సభ్యులుగా నామినేటు చేశారు:—

ఆర్. ఎస్. ధోత్రే-సమావేశ కర్త; సుశీలా పాయ్; ధీరేంద్రనాథ్ మజుందార్, ఎమ్. సత్యనారాయణ; ఖాన్ దేవ్ ఠాకూర్; జే. రత్నం పిళ్లై; మనోమోహన చౌదరీ; తిమ్మప్ప నాయక్; బబల్ భాయ్ మెహతా; మహేశ్ దత్తమిశ్ర; కాశీనాథ్ త్రివేదీ; శ్రీమన్నారాయణ అగ్రవాల్.

ఇంకొ కొద్దిమందిని సభ్యులుగా ఎంచుకొనడానికి ఈ కమిటీకి అధికారం ఇవ్వబడింది ఈ కమిటీ నిర్వర్తించవలసిన విధులివి: సర్వోదయ సమాజసేవకులయొక్క పేర్ల పట్టికలను తయారుచేయడం; జనవరి 30 న జరుగనున్న ప్రథమ వార్షిక సమ్మేళనానికి స్థలనిర్దేశంచేసి సమావేశానికి తగిన ఏర్పాట్లన్నీ చేయుంచడం; సమాజసాపనకు సంబంధించి నిర్మాణాత్మక కార్యకర్తల సమావేశం కావించిన తీర్మానాన్ని అమలుజరపడం; కమిటీలో ఏర్పడే ఖాళీలను భర్తీచేయడం; అవసరమైతే ఇదిగా కార్యనిర్వాహకులను కూడా నియమించడం.

## ఇండియా-చకస్లవేకియా వ్యాపారం

(1-వ పేజీ తరువాయి)

వచ్చును. భారత విద్యార్థులకు జకోస్లావేకియాలో విద్యార్థి వేతనములిచ్చు విషయమునను, జకో విద్యార్థులకు భారతదేశములో విద్యార్థి వేతనములిచ్చు విషయమునను మా ప్రభుత్వమువారు ఇండియా ప్రభుత్వముతో సంతోషపూర్వకముగా ఒడంబడిక చేసికొన గోరెదరు."

### ఇండియా-జకోస్లావేకియా మిత్రభావము

లండన్‌లోనం ఢిల్లీలో జకోస్లావేకియా రాయబారి డా॥ క్రొటోక్విల్ గారు జకో రాజకీయములను గూర్చియూ, ఇండియా-జకోస్లావేకియా మిత్రత్వమును గూర్చియూ ప్రసంగించిరి ఇటీవల తమదేశములో జరిగిన సంఘటనలు భారతీయులకు చాలా ఆసలపాటు కలిగించెనన్న విషయము తనకు తెలిసునని ఆయన చెప్పెను, జరిగిన సంఘటనలను న్యాయబుద్ధితో తెలుపుటకు ప్రేగ్‌లో భారత విలేఖరులు లేకపోవుటయే యిందుకు కారణమనిరి. పక్షపాతబుద్ధి కలవారు భారత పత్రికలకు వార్తలు పంపిరనిరి.

## మార్షల్ ప్రకటన

(1-వ పేజీ తరువాయి)

"ఈ మధ్య అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు లండన్లో కలుసుకుని జర్మనీ సమస్యపై చేసుకున్న నిర్ణయాలను రష్యాతోకలిసి చర్చించటానికి ఆ మూడు దేశాలూ అంగీకరించే టంతవరకూ, తాను సంయుక్తపాలన సంస్థ సమావేశాల్లో పాల్గొనవని రష్యా అనవచ్చునుకదా!" అని ఒకరు సందేహం వెలిబుచ్చగా ఆయన ఈ విధంగా జవాబిచ్చాడు.

"ఆ సమావేశంలో మేము జరిపిన సంప్రదింపులు, మా ప్రభుత్వాలకు మేము చేసిన సిఫార్సులే. మా ప్రభుత్వాలు వాటిని గురించి ఆలోచించి తేల్చుకోవలసిదే, ఆ అంశాలను రష్యాతో సంప్రదించమని మేము స్పష్టంగా ప్రకటించినాము."

### పశ్చిమ జర్మనీ ప్రభుత్వం?

"జర్మన్ ప్రభుత్వం ఏర్పాటు విషయమై తరిగిన లేదిక్కా ఉన్నవి?" అని అడగ్గా, "జర్మన్ ప్రభుత్వం ఏర్పడటమనేది వెంటనే జరగబోయినా, ఆ మహాకార్యం ఇదివరకు కన్నా దగ్గర పడినదనిమాత్రం చెప్పగలను" అని జనరల్ క్లే జవాబిచ్చాడు. "అంటే పశ్చిమజర్మన్ ప్రభుత్వమనే నా మీ ఉద్దేశం?" అని అడగ్గా, "నేనే ప్రాంతాన్నీ సూచించలేదు. పశ్చిమ జర్మన్ ప్రభుత్వాన్ని ఏర్పరచబోతున్నామని చెప్పాలన్న ఉద్దేశం నాకు లేదు" అని అతడన్నాడు

## రష్యా వేసిన అపవాదు: బ్రిటిష్ సమాధానం

లండన్, మార్చి 25: జర్మనీ సమస్యపై లండన్‌లో ఫ్రాన్సు, అమెరికా, బ్రిటన్, బెల్జియం, హాలెండు లక్సెంబర్గ్ రాజ్యాలు జరిపిన సమావేశంపై గత మాసంలో రష్యా వేసిన అపవాదులకు ఖండిస్తూ బ్రిటిషు ప్రభుత్వం లండన్‌లోని సోవియట్ రాయబారికొక లేఖ అందజేసింది.

జర్మనీలో అగ్రరాజ్య చతుష్టయం వారి అధికారం విఫలం అవడానికి రష్యాయే కారణమని ఈలేఖలో ఆరోపింప బడింది.

## బ్రిటన్‌లో కమ్యూనిస్టులపై చర్యలు

### పార్లమెంటులో ఆట్లీ హామీ

లండన్, మార్చి 25: కమ్యూనిజం తత్వం జీర్ణించి కరుడుగట్టిన కమ్యూనిస్టులను మాత్రమే ప్రభుత్వోద్యోగాలనుండి బరతరఫ్ చేస్తామని, మితవాదినందరినీ, ఇతర శాఖలకు మార్చడం జరుగుతుందని యీ రోజు కామన్సుసభలో ప్రధాని అట్లీ హామీ యిచ్చాడు ప్రభుత్వ పౌరపరిపాలనాశాఖోద్యోగాలనుండి విరమించుకొన్న ముగ్గురు ఉద్యోగులతో ప్రభుత్వం ఒక సలహాసంఘం నియమించిందని, కమ్యూనిస్టులుగాని ఫాసిస్టులు గాని అనుమానింపబడిన వ్యక్తులు, తమ వాదాన్ని ఈ సలహా సంఘం ఎదుట చెప్పుకో వీలుంటుందని ఆటే వెల్లడించాడు ప్రభుత్వ భద్రతాశాఖోద్యోగాలనుండి బర్తరఫ్ అయిన లేక బదిలీ చేయబడిన, కమ్యూనిస్టులు ఫాసిస్టుల హక్కులను కాపాడడానికి, ప్రత్యేకంగా ఒక ఉప్పీలు విచారణ సంఘాన్ని నెలకొల్పాలి" అని సభ్యులుచేసినసూచనకు సమాధానంగా ఆటే పైవిషయాన్ని వెల్లడించాడు. కామన్స చర్చకు సమాధానమిస్తూ, అత్యధిక సంఖ్యాకులను బర్తరఫ్ చేయడం జరగదని, కమ్యూనిజంపట్ల మూఢ విశ్వాసంగలవారిని మాత్రమే బరతరఫ్ చేయడం జరుగుతుందని, మితవాదిని యితర శాఖలకు మార్చడమూ రుండని ఆట్లీ తెలియజేశాడు.

ప్రభుత్వ శాఖలలో కనిపించిన కమ్యూనిస్టుల నందరినీ వేటాడడం జరగదు, యుద్ధం సంభవించే అవకాశ ముండే తరుణంలో, మనరక్షణ జాగ్రత్తలో మనము ఉండాలని. మన రహస్యాలను భద్రంగా దాచుకోవాలి.

"ప్రభుత్వంయొడ విశ్వాసం కలిగి ఉండడంలో తమకు కొన్ని బాధ్యతలు ఉంటాయనే సంగతిని కమ్యూనిస్టులు అంగీకరించరు. ప్రభుత్వంయొడ విశ్వాసము, నైతిక బాధ్యతలు లేకపోతే, మన దైనందిన వ్యవహారం సాగడం కష్టం. ప్రపంచ మంతటా కమ్యూనిస్టు ఉద్యమం యేపంథాలో నడుస్తున్నదీ, ఒక దేశం తరువాత ఒక దేశం కమ్యూనిస్టు ప్రాబల్యం క్రింద పడిపోతున్నదీ మనం చూచాము. ఎవరైనా సరే తమ యిష్టవచ్చిన అభిప్రాయాలను కలిగి ఉండవచ్చు కాని, ప్రజలకు యితర ప్రభుత్వంతో సాన్నిహిత్యం కల్గింపనియగానూ, యీ సాన్నిహిత్యంవల్ల దేశానికి హానికరంగా ఉండే చర్యలు జరిగేటట్లు యీ అభిప్రాయాలు తోడ్పడు తున్నాయని తెలిసే, కఠినమైన చర్య తీసుకోవలసిందే. ప్రభుత్వం ఏంచేసినా, అమెరికన్ కోటీశ్వరుల ఆజ్ఞలను శిరసావహించి చేస్తున్నదని గల్లాచర్ (కమ్యూనిస్టు) అన్నాడు. ఇది మామూలు కమ్యూనిస్టు ధోరణిలో ఉన్న ఆరోపణే; తాము ఏదో చేయ సంకల్పించుకొని, అందుకుగాను యితరులను దూషించడం కమ్యూనిస్టులకు పరిపాటే

### గల్లాచర్ విమర్శ

బ్రిటన్ ఆర్థిక సౌభాగ్యానికి సంపూర్ణ స్వాతంత్ర్యానికి కమ్యూనిస్టుపార్టీ పోరాడుతున్న లేబర్, కన్సర్వేటివ్ పార్టీ నాయకులు దేశాన్ని అమెరికన్ కోటీశ్వరులకు అమ్మివేస్తున్నారు; సోవియట్ రష్యాపై యుద్ధంచేయాలని అమెరికా యీ యుద్ధంలో బ్రిటన్‌ను తన సైనిక స్థావరంగా చేసుకోవాలని బ్రిటన్ సంకల్పం. అప్పుడు ప్రభుత్వం పోతుంది. రాజకుటుంబం బహుశః ఒట్టవానగరానికి తరలిపోతుంది. నాశనమవడానికి చివరకు మిగిలేది ప్రజలే" అని కమ్యూనిస్టు గల్లాచర్ అన్నాడు.

## ట్రీస్ట్ సమస్య

### యుగొస్లోవియాతో సంప్రదింపులకు ఇటలీ సుముఖత

రోమ్, మార్చి 25: ట్రీస్ట్ సమస్య విషయమై యుగోస్లోవియాతో ముఖాముఖి సంప్రదింపులు జరపడానికి ఇటలీ ప్రభుత్వ సమ్మతించదన్న", అయితే యీ సంప్రదింపులు బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ ప్రభుత్వాలు ప్రకటించిన ఉద్దేశ్యాలకు అనుగుణంగా సాగవలెనని ఇటలీ ఉద్దేశం కొంటుందని, ఇటాలియన్ విదేశాంగశాఖా కార్యాలయముద్యోగి ఒకడు యిన్నాళ్ళ వెల్లడించాడు.

### ఇద్దరు కమ్యూనిస్టుల అరెస్టు

విజయవాడ, మార్చి 25: టి వెంకటేశ్వరరావు, ఎన్. రంగారావు అను ఇద్దరు కమ్యూనిస్టులను స్థానిక సవర్నరుపేట పోలీసుస్టేషను సబ్-ఇన్‌స్పెక్టరు శ్రీ రామచంద్రమూర్తిగారు యీ చరకరంలో అరెస్టు చేసిరి విద్రోహచర్యలు జరుపుచున్నందున వీరిద్దరిని అరెస్టు చేసినట్లు డి.ఎస్. పి. యిచ్చినవారిని వి. సుబ్బారావు గారిని కూడా అరెస్టు చేసిరి. (స్వ వి)

### బళ్ళారిలో ప్లేగుసల్ల ఒక మరణం

బళ్లారి, మార్చి 25: పూనా నుండి వచ్చిన వనస్వతీబాయి అనే 23 ఏండ్ల ఆమె గత రాత్రి స్థానిక ప్రభుత్వ ఆసుపత్రిలో ప్లేగువలన మరణించెను. హెల్త్ ఆఫీసర్ వి. రామచంద్రరావుగారు ప్లేగునివారణ చర్యలను తీసికొనుచున్నారు. స్వ.వి.

## పట్టణ వార్తలు

### రాష్ట్రంలో ధాన్యసేకరణ

మదరాసు, మార్చి 25: రాష్ట్రంలో ధాన్యసేకరణ యింకా తగ్గముఖంగానే ఉన్నది. మార్చి 20 వ తేదీతో అంతమైన వారంలో 30505 టన్నుల బియ్యం లభించెను. అంతకుపూర్వం వారంలో 32254 టన్నుల బియ్యం సేకరింపబడి యుండెను. ధాన్యసేకరణ తగినమా నిలవల మొత్తం మాత్రం 298008 నుండి 310277 వరకు పెరిగినది మదరాసు నగరంలో 40 రోజులకు సరిపోయే ధాన్యం నిలవ 11842టన్నులు యున్నవి.

### విశాఖపట్నంలో రేషను తొలగింపు

మదరాసు, మార్చి 26: విశాఖపట్నంలో ఏప్రిలు మొదటివారమున రేషను తొలగగలదని రూఢిగా వర్తమానం తెలుస్తున్నది.

### కర్నూలులో బియ్యంకరువు

కర్నూలు, మార్చి 25: నిన్న ఉదయమునుండి ఈ ఊరిలోని రేషన్ డిపోలలో బియ్యము లేనందున రేషనుకార్డులు కలవారు చాల ఇబ్బంది పడుచున్నారు. విచారించగా టోకున రకులవద్ద బియ్యము ఉన్నవని, కాని వాటి అమ్మకమునకు ధరలు నిర్ణయము కానందున ఇవి విడుదల కాలేదని తెలిసినది. రేపు అడిగ రయు నండి రేషనింగు తొలగనుండగా ఇటువంటి స్థితి ఏర్పడుట ప్రజలలో ఆందోళన కలిగించినది (స్వ. వి.)

### బొంబై రేవుకు ఆహారధాన్య నౌకలరాక

బొంబాయి, మార్చి 25: విదేశాలనుండి మనదేశానికి రావలసిన ఆహార నౌకలు క్రమంగా ఒక టొకటే బొంబాయి చేరుకుంటున్నాయని తెలుస్తోంది. ప్రభుత్వ ధాన్యాగారములన్నీ భర్తీ అయినా యిక. అహారశాఖోద్యోగులు ఇంకా క్రొత్త ధాన్యాగారాలను నిర్మించడానికి ప్రయత్నిస్తున్నారట. యు. ప్రె.

## మారిన సుబ్బారావుగారి మరణం

రాజమహేంద్రవరము, మార్చి 25: స్థానిక కోఆపరేటివుబాంకు అధ్యక్షులు, చెన్నరాష్ట్ర శాసనసభ మాజీ సభ్యుడు ప్రజాహితజీవి, కాంగ్రెసువాది శ్రీ మారిన సుబ్బారావుగారు మార్చి 24 తేదీన, చెన్నపట్నంలో, రక్తపోటువలన, చనిపోయినని తెల్పుట కెంతయు విచారించుచున్నాను. శ్రీ సుబ్బారావుగారు 1921, 1941 ఉద్యమాలలో చెఱసాలకు వెళ్లిరి. 1929 రీసెటిల్మెంటు రోజులలో తూర్పు గోదావరి జిల్లాలో బ్రహ్మాండమగు ప్రచారమును సల్పిరి.

నాయకోపతి వైద్యమన్న చాలా అభిమానము, వీరి మరణమువలన రాజమండ్రి కాంగ్రెసుకు తీరనినష్టము వాటిల్లినది వారి వయస్సు 65 ఏండ్లు

24 తేదీ రాత్రి బొంబాయి మెయిలులో శ్రీ సుబ్బారావుగారి కళేబరమును ఇచ్చటికి తీసికొని వచ్చిరి గోదావరి స్టేషను వద్ద కొన్ని వందలమంది శ్రీ సుబ్బారావు గారిని కడసారి చూచుటకు వచ్చిరి. దహన సంస్కారము నిమిత్తము కారులో సుబ్బారావుగారి కళేబరమును దోసకాయలపల్లి తీసికొని వెళ్లిరి. (స్వ. వి)

### ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సేవాదళ ఆఫీసర్ల శిక్షణ కేంద్రము

బెజవాడ, మార్చి 24: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సేవాదళ ఆఫీసర్ల ద్వితీయ శిక్షణాకేంద్రము ఏప్రిల్ 15 వ తేదీనుండి ప్రారంభమగునని, 10 వ తేదీలోగా ఆంధ్ర రాష్ట్ర సేవాదళ జి. ఓ. సి. లు రాష్ట్రము నుండి సరక్షితనబడి దరఖాస్తుదారుల నుండి అభ్యర్థులను సెలెక్టుచేయుదురని, శిక్షణ కేంద్రములో తర్ఫీదుపొంది, పూర్తి కాలము సేవాదళములో పనిచేయగోరు విద్యార్థిశిలరూపన యువకులు ఏప్రిల్ 1 వ తేదీలోగా విజయవాడలోని 'కాంగ్రెస్ సేవాదళబోర్డు'కు వారిపూర్తి అడ్రసుతో దరఖాస్తులు పంపుకోవలెనని రాష్ట్ర కాంగ్రెసు సేవాదళబోర్డు కార్యదర్శి వ్రాసిరి.

### రాష్ట్ర కాంగ్రెసు శిక్షణ శిబిరం

విజయవాడ, మార్చి 23: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు శిక్షణశిబిరమొకటి ఏప్రిల్ 16 వ తేదీ నుండి ఇచ్చట ప్రారంభమగునని, కాంగ్రెసు సేవావిధానమును జరిపెదరని ప్రముఖ ఉపన్యాసము లిచ్చెదరని చేర దలచువారు వివరములు రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమునుండి తెలుసుకొనవలెనని కార్యదర్శి వ్రాసిరి.

### సబుకోర్టులు తగ్గించుచట్టం

మదరాసు సివిలుకోర్టుల చట్టసవరణ బిల్లును మదరాసుప్రభుత్వంవారు ప్రకటించి ఇప్పటివలె జిల్లాకొకరుగాక, రెండు మూడుజిల్లాల కొక జడ్జిని నియమించి, హైకోర్టు నిర్ణయించు కాలాలలో అతను జిల్లాకేంద్రాలకు పోయి, కేసులు విచారించుటకు కొత్త పద్ధతి ఏర్పరచదలచిరి.

# దేవమాడపై ఇత్తెహాద్ గూండాలదాడులు

## చాటువ్యాపారం చేసేవారిపై సాక్ష్యం దొరుకుటలేదు

### అసెంబ్లీలో ప్రశ్నోత్తరాలు

నేడు (గురువారం) ఉదయం అసెంబ్లీ ప్రశ్నకాలంలో ప్రధాని శ్రీ ఓమందూరు రామస్వామిరెడ్డి గారు హాజరై నారు. శ్రీనివర్తి వెంకట సుబ్బయ్య, కర్నూలు జిల్లాలోని దేవమాడపై నైజాం గూండాలు మార్చి 15 నాడు ఆయుధాల్తో దాడి చేసి, నారాయణ అనే వ్యక్తి ఇల్లును దోపిడీ చేసినారని ఫిబ్రవరి 6 నాడు కొండ ప్రకటూరుపై గూడా దాడి చేసినారని, ప్రభుత్వం ప్రజలను రక్షించలేదని సమ్మకం ప్రజల్లో వ్యాప్తమయిందని, ప్రభుత్వం ఏమి చేస్తున్నదని అడిగారు. డా॥ సుబ్బరాయన్ సమాధానం చెప్తూ గూండాలు గాలిలోకి తుపాకులు పేల్చినచా్త్ర తపుడు జేసిన దన్నారు. నెయ్య మా తొయల నిలుపన ఆసిని నారాయణ ఇంటినుంచి దోపిడీ చేశారు. ప్రభుత్వం తమకు చేతనైనంత రక్షణ నిస్తున్నది. ప్రజారక్షణకై ప్రభుత్వం ఏమేమి చర్యలు తీసికొంటున్నది చెప్ప వీలుకాదు. హోంగార్డ్సను ప్రభుత్వం నియమించ ప్రయత్నిస్తోంది అని మంత్రిగారు చెప్పారు.

శ్రీ వెంకటసుబ్బయ్య: హైదరాబాదులో ఉన్న ఒక ఆయుధ ఉత్పత్తి కేంద్రం, ఈ గూండాలకు ఆయుధాల్నిస్తోంది.

మంత్రి: ఈ విషయమై భారత ప్రధాన మంత్రి, హైదరాబాదులోని ఏజెంట్ జనరల్ ద్వారా విచారణచేస్తున్నారు. కాని సరిహద్దు సంఘటనలపై రాష్ట్ర ప్రభుత్వానికి వచ్చిన వార్తలనుబట్టి రాష్ట్ర ప్రభుత్వం చర్యలు తీసికొంటుంది. భారత సమాఖ్యకు ప్రమాదం జరగకుండా మాత్రం చూస్తాము.

### నైజాం ప్రభుత్వం పనిచేయుటం లేదు!

జనాబ్ రజాఖాన్: ఈమధ్య హైదరాబాద్ ప్రధాని, మద్రాసు ప్రధాని కలసి సరిహద్దు సమస్యల్నిగూర్చి చర్చిస్తారని విన్నాము. ఎందువల్లవారు కలుసుకోలేదు.

మంత్రి: సరిహద్దులో ఉన్న నైజాం జిల్లాలలో కొంతభాగంలో ప్రభుత్వమనేదే లేదు. కాబట్టి ఈ కలయిక అనవసరమయింది.

శ్రీ బ్రహ్మానందరెడ్డి:—బొంబాయి సరిహద్దుల్లో, ప్రజలకు ధైర్యం కల్గించటానికి సైనికులు ఊరూరా తిరుగుతున్నారు. ఇక్కడకూడా అలా చేయవచ్చుకదా?

మంత్రి:—ఇలేవిధంగా ఇత్తెహాద్ గూండాలు ఆక్రమణచర్యల్ని బాగా కొనసాగిస్తే ఏదోఒకటి చెయ్యక తప్పదు.

### ఆయుధాలు లేవు!

శ్రీ ఆల్లూరి సత్యనారాయణ:—సరిహద్దు ప్రజలలో నమ్మకమైనలకు ఆయుధాలిస్తే సమంజసంగా ఉంటుంది.

మంత్రి:—ఆయుధాలకోసం కేంద్రప్రభుత్వానికి వ్రాశాము. మన పోలీసులకే ఆయుధాలులేవు. పోలీసులకు ఆయుధాలివ్వటం క్షేమకరం. ముందు వారికి ఆయుధాలిచ్చి, తర్వాత వ్యక్తుల విషయం ఆలోచిస్తాము.

శ్రీ వెంకటసుబ్బయ్య:—సరిహద్దు కార్యక్రమాలలో ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వారికి సంపూర్ణ స్వేచ్ఛ ఉన్నదని, వారొక కరపత్రాన్ని ప్రకటించారు. ప్రభుత్వంవారికి తెలియునా?

మంత్రి: ఇత్తెహాద్, నైజాంను కూడా లక్ష్యపెట్టటం లేదని మాకు తెలుసు. కాని కరపత్రం సంగతి తెలియదు. దాన్ని స్వీకరించటం మాకు సంతోషమే.

శ్రీ వెంకటసుబ్బయ్య: రాష్ట్రంలో ఒక ఆయుధాలఫ్యాక్టరీని స్థాపించుతారా?

మంత్రి: దీనికి ప్రశ్నోత్తర నివృత్తి సాధ్యం కాదు.

శ్రీ కల్లూరి సుబ్బారావు: నల్లగొండ జిల్లా కమ్యూనిస్టులు, కృష్ణాజిల్లా కమ్యూనిస్టులకు ఆయుధాల్నిచ్చి, ఆ జిల్లాను వారి చర్యలకు కేంద్రంగా చేయుచున్నారు తెలియునా?

మంత్రి: గౌరవ సభ్యునికి, నా కంటె ఎక్కువగా తెలిసినట్లున్నది.

### కోర్టులో దొంగపత్రకం

శ్రీ బాపినీడు, లక్ష్మణ్ ప్రసాద్ అండ్ సన్స్ వారు హిందుస్తాన్ 10 అమ్మకంలో అక్రమ లాభాలను సంపాదిస్తున్న విషయమై ప్రశ్నించగా మంత్రిగారు సమాధానం చెప్తూ ఈ విషయం ఆ కంపెనీ వ్రాయగా వారు, రాష్ట్రప్రభుత్వంతో తమకు సంబంధంలేదని వ్రాశారన్నారు. కాని వారి దగ్గర్నుంచి వివరాలు వచ్చేటట్లు చిరిగి ఈ లేఖలు పంపబడ్డాయి. వారు బోగస్ ఒక్కొక్క కారుకు రు. 9550 రు. అమ్మటం చాలా అక్రమం. ఈ కంపెనీ విషయమై ప్రభుత్వానికి తెలుపబడింది కాని సి. ఐ. డి. లు మాత్రం పనిచేస్తూ ఉంటారని మంత్రిగారు చెప్పారు.

జనాబ్ రజాఖాన్ అడిగిన ఒక ప్రశ్నకు మంత్రిగారు, ఎక్కువ ధరలకు

# మాంటిసరీ విద్యావిధాన ప్రాశస్త్యం

## అడయార్ పాఠశాల వార్షికోత్సవంలో గవర్నర్ అభిభాషణ

మద్రాసు, మార్చి 24: "భారతదేశ భవిష్యత్తునుగూర్చి ప్రతివారూ ఊరికే ఉపన్యాసాలిస్తున్నారు. ఆదర్శాలను గురించి మాట్లాడడం తేలికే కాని వాటిని సాధించాలంటే మనం కార్యవాదులం కావాలి", అని మద్రాసు గవర్నరు సర్ ఆర్చిబాల్డు నైగారు నేటి సాయంత్రం అడయారులోని అరండేల్-మాంటిసరి పాఠశాల వార్షికోత్సవానికి అధ్యక్షతవహిస్తూ అన్నారు.

సమావేశానికి, ఆహ్వానింపబడిన ప్రముఖులుమాత్రమే వచ్చారు. గవర్నరు గారు రాగానే శ్రీమతి రుక్మిణీదేవి వారికి స్వాగతమిచ్చి పాఠశాలను చూపించారు.

ఈ పాఠశాలలవల్ల భారతదేశంలోని వివిధ భాషలవారేకాక ప్రపంచమంతటి నుండీ భిన్నజాతుల బాలురు సమావేశం అవుతున్నారనీ, పాఠశాలలో విద్యాబోధకులు అయిన డాక్టర్ మాంటిసరీ యిందుకు అభినందనీయులనీ శ్రీమతి రుక్మిణీదేవి స్వాగతోపన్యాసంలో అన్నది.

సభలో మాంటిసరీ విద్యావిధానం, పద్ధతులు ప్రదర్శింపబడినవి.

అనేక విద్యాసంస్థ లున్నాయిగాని మానవ వ్యక్తిత్వంపై పరిశోధనలు జరిపే సంస్థ ఒక్కటైనా లేకపోవటం శోచనీయమని డాక్టర్ మాంటిసరీగారన్నారు.

మాంటిసరీ విద్యావిధానంలోని గొప్ప గుణం అది కార్యవాదిత్వమునే బోధిస్తుందనీ, విజ్ఞానమునే కాక జీవితాన్నిగూడ రుచి చూపిస్తుందనీ, గవర్నర్ నైగారు తమ ఉపన్యాసంలో చెప్పారు.

తిరుపతి, గుంటూరు మునిసిపల్ వార్డుల పరిహద్దులు మార్చుచు గజిటులో ప్రకటించిరి.

హైస్కూల్ తరగతులందు నేర్పదలచిన వృత్తి విద్యల సిలబసు (వివరాలు) యీ వారం గజిటులో ప్రకటించబడినవి.

### బెజవాడ — విజయవాడ

"బెజవాడ" మునిసిపాలిటీ పేరు విజయవాడ అని మార్చుటకు ప్రభుత్వంవారు నిశ్చయించి, యీ వారం గజిటులో ప్రకటించిరి. ఆ వూరు నివాసులు ఆక్షేపణ యున్నచో ఆరువారాలలోగా రాష్ట్రీయ ప్రభుత్వానికి తెలుపుకోవలెను.

### పండితుల వేతనాలు

మదరాసుప్రభుత్వమువారి సర్వీసులో నున్న హైస్కూలు ఉపాధ్యాయులగు పండితులు, మూంషీల జీతాలను, స్థానిక సంస్థలందున్న పండితులు మూంషీలకు జీతాల రేట్లు సవరించుచు 23 వ తేదీన ప్రకటన గావించిరి. ఈ క్రొత్త రేట్లు 1948 జనవరి 1 నుండి వర్తించును.

## సభలు- సమావేశములు

గుంటూరునందలి శ్రీ శారదానికేతన రజతోత్సవమును, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతుల 70, 65 జన్మదినోత్సవములను ఈనెల 27, 28-లలో జరుగును.

కృష్ణాజిల్లా విద్యార్థి కాంగ్రెసు 4-వ మహాసభ ఏప్రియల్ 3, 4 తేదీలలో గుడివాడలో జరుగును.

అమ్ముతున్నాడు అని చెప్పేవారు, తీరా ముందుకు వచ్చి సాక్ష్యం చెప్పలేకుండా ఉన్నారన్నారు.

శ్రీ విశ్వనాథం: అయితే మీరు నియమించిన సి. ఐ. డీలను తీసేయవచ్చు కదా?

జవాబు లేదు:

### ఒక ప్రశ్న

శ్రీ నాగప్ప: బాపట్ల తాలూకాలోని, మోదుకూరు గ్రామంలో, తుంగభద్రా నది ప్రక్కన, 40 ఎకరాల పోరంబోకు భూమిని సాగుచేస్తున్న హరిజనులనుంచి, ఏమైనా విన్నపం వచ్చిందా?

శ్రీ వెంకటరావు:—లేదు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి:—గుంటూరు జిల్లాలో తుంగభద్రానది ఉందా? (నవ్వు)

శ్రీ వెంకటరావు:—లేదుకాదు. గౌరవ సభ్యుడు రెండుతప్పులు చేశాడు. ఒకటి తుంగభద్రానదికాదు కాలవ. రెండు మోదుకూరు తెనాలి తాలూకాలో ఉన్నది (నవ్వు).

### గారఫిర్కా అభివృద్ధి

శ్రీ గరిమెళ్ల కుమారస్వామి, గారఫిర్కా అభివృద్ధినిగూర్చి అడిగిన వివరాలకు ప్రక్కనేకూర్చున్న ప్రధానికిబదులు, డా॥ సుబ్బరాయన్ చెప్తూ, ఈ ఫిర్కా అభివృద్ధికై రూ 50,000 ప్రత్యేకింపబడిందన్నారు. సమగ్రమైన అభివృద్ధి కార్యక్రమం ఆలోచనలోఉంది. రోడ్లను బాగు చేయటం, కొత్తరోడ్లను వేయటం, చెరువులు బావులుతవ్వటం జరుగుతుంది. ఆ ఫిర్కా కేంద్రంలో వస్త్రంగం, పశువుల నిర్మాణం జేర్పబడుతోందని మంత్రిగారు చెప్పారు.

## ఆర్థిక పారిశ్రామిక వ్యాపార విషయాలు

# ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచండి

## శాసనసభ్యులకు శ్రీ గోపాలరెడ్డి విన్నపం

### ఆర్థికశాఖ కార్యదర్శి ఉద్యోగ విరమణ

చెన్నపట్నం, మార్చి 26: రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేయటానికి శాసనసభ్యులంతా తోడ్పడాలని, అందుకు అవసరమైన సలహాలను ఇస్తూ ఉండాలని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి నిన్న సాయంకాలం రాజాజీహాల్‌లో శాసనసభ్యులకిచ్చిన అల్పాహారవిందు తర్వాత మాట్లాడుతూ కోరారు.

బడ్జెట్ సమావేశం విజయవంతంగా ముగిసినందులకై ఆర్థికమంత్రి శాసనసభ్యులందరకు అల్పాహారవిందు నిచ్చారు. విందుకు వివిధశాఖల కార్యదర్శులు, గవర్నర్ దంపతులు వచ్చారు. గోపాలరెడ్డి దంపతులు అతిథులకు ఆహ్వానించి గౌరవించారు. అల్పాహారానికి వచ్చిన పెద్దలు చాలా హుషారుగా కాలం గడిపారు. సంతోషంతో ఎవరైనా బిగ్గరగా మాట్లాడినా, లేక బల్లలు కొట్టినా, ఎవరో ఒకరు 'ఆర్డర్'-'ఆర్డర్'- అంటూ స్పీకరును అనుకరించ సాగారు. శ్రీ పైడా వెంకట నారాయణ కుర్చీ విరిగేలాగున కొట్టారు. ఒక సభ్యుడు ఈ సంఘటనపై స్పీకర్ తీర్పునివ్వాలని కోరాడు. అంతా ఘొల్లున నవ్వారు.

అల్పాహారానంతరం శ్రీ గోపాలరెడ్డి, అతిథులకు వందనా లర్పిస్తూ ఆర్థికమంత్రి పని చాలా కష్టమన్నారు. ప్రతిపాలపక్షసభ్యులు ఆర్థికమంత్రిని విమర్శిస్తే, ఆర్థికమంత్రి తదితర మంత్రుల్ని విమర్శిస్తూంటాడు. ప్రతి ఖర్చుకు ఆర్థికమంత్రి అడ్డుపడటంచేత, మంత్రులందరికీ ఆయనపై చిరచిరలాడుతూ ఉంటుంది. ఒక రాష్ట్ర ప్రధానమంత్రి, ఆర్థికమంత్రి పెట్టే ఇబ్బందుల్ని భరించలేక, ఫైనాన్సు ఆర్థిక మంత్రి మానుకొమ్మని కోట్లాడట! ఆర్థికమంత్రి, మంత్రులకు మంత్రి. ఏ బడ్జెటయినా అధికారంలో ఉన్న పార్టీ సిద్ధాంతాలకే చేటలో చెరగబడే, శాసనసభలోకి ప్రవేశిస్తుంది. అది తప్పదు. అది శాసనసభలో అమోదింపబడ్డప్పుడు, అది అందరికీ సంబంధించిన బడ్జెట్ అవుతుంది. ఈ రాష్ట్రంలో ఆహారవిషయంలో స్వయం పోషకంగా ఉండాలనే మంత్రివర్గపు వాంఛ. అందుకనే నీటిపారుదల కార్యక్రమాలకి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వటము జరిగింది అని శ్రీగోపాలరెడ్డి చెప్పారు.

#### డా॥ డాడ్వెల్

శ్రీ గోపాల్‌రెడ్డి, తరువాత ఆర్థికశాఖా కార్యదర్శి డా॥ డాడ్వెల్ ఉద్యోగాన్నుంచి విరమించి, ఆస్ట్రేలియాకు ప్రయాణమై పోతున్నారని అభినందించారు. డా॥ డాడ్వెల్ చాలా సమర్థుడని అభినందిస్తూ, శ్రీయుతులు రాజగోపాలాచారి, ప్రకాశంగారలు కూడా ఆయనను చాలా ప్రశంసించి ఉన్నారని చెప్పారు.

#### కేంద్ర ఆదాయంలో భాగం

"ఆదాయపు పన్ను మొత్తం లోంచి మన రాష్ట్రానికి, కేంద్రం నుంచి ఎక్కువ భాగం రావటంలేదు. పొగాకు పన్నునుంచి మనకులభించే భాగం కూడా స్వల్పమే. ఎక్సైజు నుంచి కూడా రూ 22 లక్షలు మాత్రమే వస్తోంది. సభ్యులు ఈ విషయాన్ని అధికంగా ప్రశ్నించలేని, సంగతుల్ని తెలుసుకోవాలి" అని ఆర్థిక మంత్రి కోరారు.

ప్రతిపాలకపక్షనాయకుడు మహమ్మద్ ఇస్మాయిల్ గారు ఆర్థిక మంత్రిని అభినందిస్తూ మాట్లాడారు.

డా॥ లక్ష్మణస్వామి మొదలియార్ ప్రసంగిస్తూ, స్పీకర్ కష్టపడి శాసనసభ్యుల మన్నారు.

సభ్యులు సభలో నిద్రపోవచ్చునా, గురక పెట్టవచ్చునా, లేక వినిపించరవచ్చునా అనే ధర్మసందేహాలపై తీర్పిస్తూ ఉంటారు (నవ్వు) సభానాయకుడు సరేసరి. మిత్రుడు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు డా॥ సుబ్బారాయన్ సమాధాన మివ్వటానికి తయారవుతూ ఉంటారు. (నవ్వు) తెల్లవారి నిద్రలేచేటప్పటికీ—అసెంబ్లీ హాల్లో అరగంటలోనే నిద్రలేస్తారు సభ్యులు—ప్రతి కల్లో విని, వాళ్లతో అని డా॥ సుబ్బారాయన్, స్పీకర్, ఏమేమి మాట్లాడారు అని అంతా మాస్తారు (నవ్వు) విమర్శించటం సభ్యులహక్కు. అనుకున్న ప్రకారం బడ్జెట్‌ను ఆమోదింపచేసుకోటం ఆర్థిక మంత్రిహక్కు (నవ్వు) అసెంబ్లీలో చాలా తక్కువమంది మాట్లాడారు. కాని కొన్ని లోలోపల సగంమంది బడ్జెట్‌పై ప్రసంగించారు (నవ్వు) చెన్నరాష్ట్రం తక్కిన

రాష్ట్రాలకన్న ఆదాయ వ్యయాలలో చాలా ముందుకుపోతోంది. దానికితోడు సమగ్ర మద్యపాననిషేధంకూడా ప్రవేశపెట్టబడింది. మనం చాలా గర్వించదగ్గ విషయం, అని డా॥ మొదలియార్ అన్నారు.

కుమారరాజా ముత్తయ్య చెట్టియార్ ప్రసంగిస్తు ఆర్థిక మంత్రి గారు నవ్వుతూనే పన్నులవిధించి రాష్ట్రానికి ఇంకెవరూ చేయనంత ఎక్కువచేశారన్నారు. ఇకనుంచి రెండు సభలేకాక, మూడోసభకూడా ఉండాలి (నవ్వు) ఆసభలో గాలి మంత్రులంతా ఉండాలి (నవ్వు)

డా॥ రాజన్: మీరు ఒక స్థానం దానం టుంచేసి కాయంచేసుకున్నారా?

ముత్తయ్యచెట్టి: కాయంచేసుకొని చాలా కాలమయింది. ఆర్థిక మంత్రికి ఆదర్శాలచేత చెప్పి అనవసరవ్యయాల్ని లేకుండాచేస్తే మరీబాగుండేది

డా॥ జాన్ కూడా మాట్లాడారు.

గవర్నర్ సర్ ఆర్చిబాల్డ్ నై మాట్లాడుతూ తమ ఆదాయం తక్కువ అని తెలుసునన్నారు. కాని రాష్ట్ర ఆదాయం సముద్రమంత, సొంతఆదాయ వ్యయాల్లాంటిదికాదు. (నవ్వు) రాష్ట్ర ఆదాయవ్యయాలను మాస్తే, గారడీవాళ్లు జ్ఞాపకంవస్తారు, కాని శ్రీ గోపాలరెడ్డి గారిని గారడీవాడికి కూడా అతీతులు (నవ్వు) ఆర్థిక మంత్రి గారికి, ఈ విందు ఇచ్చినందుకుకై కృతజ్ఞత లని గవర్నర్ అన్నారు.

శ్రీ కె. వరదాచారి గారు "ఏటుల కొన్ని లీలలు" అనే కృతిని పాడిన తరువాత కార్యక్రమం ముగిసింది.

Edited, Printed & Published by rS. Sambu Prasad at the Andhra Patrika Pess, No. 7. Thambu Chetty St. Madras

# ఆంధ్రదేశంలో ఖనిజ సంపద

## నిపుణుల సంఘ నియామకం జరుగుతుంది

మద్రాసు, మార్చి 23: మద్రాసు రాష్ట్రంలో ముఖ్యంగా దత్తమండలం జిల్లాలలో భూగర్భపరిశోధనలకు కేంద్రప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని నియమించబోతున్నదని మద్రాసు పరిశ్రమ శాఖామంత్రి నిన్న శాసనసభలో ప్రకటించారు. ఈ జిల్లాలలో అగేట్, జిప్సమ్, ఆస్బెస్టాస్, బ్రైటిన్, ఇనుము, మైకా, క్యానైట్, సున్నపురాయి, సీసం మొదలైన ఖనిజద్రవ్యాలు దొరకుతాయనీ, ఉత్తర సర్కార్ జిల్లాలలో క్రోమైట్, సిలికా, గంధకం, మైకా, బొగ్గు మొదలయిన లోహాలు దొరకుతాయనీ వివరాలవల్ల తెలుస్తోంది.

ఆంధ్రదేశంలో 3 కోట్ల 20 లక్షల టన్నుల ప్రశస్తమైన బొగ్గు భూగర్భంలో నిలవ వున్నదని కనుగొనబడింది. ఆంధ్ర జిల్లాలలో దొరికే ఈ వివిధ ఖనిజములను త్రవ్వి తీయాలంటే మాచ్‌ఖండ్‌నదిపై నున్న డుడుమా జలపాతంనుండి, గోదావరిపైన రామపాదసాగర్ ప్రాజెక్టునుండి విరివిగా తేలికగా విద్యుచ్ఛక్తి సరఫరా జరుగవలసివుంటుంది.

గత అక్టోబరులో కలకత్తాలో కేంద్ర ప్రభుత్వపు గనులు, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి భారతప్రభుత్వ ఖనిజవిధానాన్ని ఈ విధంగా స్పష్టపరిచారు.

(1) ఖనిజములు, లోహములు విషయంలో దేశాన్ని స్వయంసమృద్ధంగా చేయాలి.

(2) పరిశ్రమల అభివృద్ధికి పనికివచ్చే ఖనిజములను కేంద్రప్రభుత్వం కంట్రోలు చేస్తుంది.

(3) దేశంలోవున్న ఖనిజసంపద యావత్తూ ప్రభుత్వానికే చెందుతుంది.

(4) "ఆల్యూమినియమ్" మొదలయిన మిశ్రమ లోహములు దేశంలోనే ఉత్పత్తి అయ్యేటట్లుగా ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది.

ఈ ఆశయములను కార్యరూపంలో పెట్టడానికి ప్రభుత్వం పంచవర్ష ప్రణాళిక నొకదానిని అమలుపరుస్తుంది. ఈ ప్రణాళిక ప్రకారం భారతదేశంలో భూగర్భపరిశోధన జరుగుతుంది. భూగర్భశాస్త్ర విజ్ఞానం బోధించే సౌకర్యాలు కూడా ప్రభుత్వం కలిగిస్తుంది.

### ధరల తగ్గింపుకు ఫ్రెంచి ప్రభుత్వకృషి

పారిస్, మార్చి 24: వస్తువుల ధరలను బాగా తగ్గించడానికి మరొక తీవ్ర ప్రయత్నం చేస్తున్నామని ఫ్రెంచి ప్రభుత్వం ప్రకటించింది. కమ్యూనిస్టుల నాయకత్వం క్రింద ఎక్కువ జీతాలను కోరుకున్న కార్మిక సంఘాల ఆందోళనను సర్దడానికే యీ ప్రయత్న మట. ధరల తగ్గింపు విషయంలో ప్రభుత్వమూ, కార్మికులూ ఒక సమాధానానికి త్వరలో వస్తారు.

# రష్యా - ఇంగ్లండు ధాన్యం ఒడంబడిక

## రహస్య షరతులపై లండన్ పత్రికల విమర్శ

లండను, మార్చి 24: అతిజాగ్రత్తగా రహస్యంగా వుంచబడిన ఆంగ్లో-రష్యన్ ధాన్య ఒడంబడికలోని కొన్ని షరతులు, ధాన్యపు షరతులకు ఎల్లాగో తెలిశాయి. ఈ షరతులను చూసి పత్రికలంతా ఆశ్చర్యచకితులై ఉన్నారు. ఈ ఒడంబడికప్రకారం టన్ను జొన్నలు 31 పౌనుల 16 షిల్లింగుల చొప్పున బ్రిటన్ రష్యానుండి గతనెలలో పుచ్చుకున్నదని తెలుస్తోంది. టన్ను 21 పౌనుల 2 షిల్లింగులకు పంపించే అర్జెంటీనా జొన్న ధరలకంటె యిది చాల ఎక్కువ.

మరొక షరతుప్రకారం, రష్యావారు పంపించిన ధాన్యం వారు వర్ణించినంత మంచిది కాకపోతే యీతగవు పరిష్కారం చేసుకోవలసింది మాస్కోలోనట. యుద్ధాపూర్వం యీ పరిష్కారాలు లండన్‌లో జరిగేవి. ఈ షరతుకూడా షరతులకు కంటకంపుగా వున్నది.

రష్యానుండి వచ్చిన జొన్నలను బ్రిటిష్ ప్రభుత్వం బ్రిటిష్‌రైతులకు టన్ను 10 పౌనుల చొప్పున అమ్ముతుంది అంటే కొన్ని నగరలో మూడవవంతు. ఈ విధంగా రైతులకు తక్కువధరలకు ధాన్యం, సప్లయి చేయడంవల్ల ప్రభుత్వానికి సాలీనా 45 కోట్ల పౌనుల దనంగా ఖర్చవుతుందని అంచనా వేయబడింది.

# ఆసియాఖండ ధాన్యాగారం – సింహళం

## ద్వీప ఆర్థికభవిష్యత్తు: మంత్రుల ఆశాభావం

లండన్, మార్చి 25: బ్రిటిష్ ప్రభుత్వానికి, సింహళ ప్రభుత్వానికి మధ్య ప్రారంభం కానున్న ఆర్థిక సంభాషణలు సఫలమైతే, పూర్వ రాజులకాలంలోవలెనే సింహళం ఇప్పుడుకూడా ఆసియాఖండానికి ధాన్యాగారం కాగలదని సర్ ఆలివర్ గుణతిలకే, జె ఆర్. జయవర్ధనే నేడు రాయిటర్ విలేఖరితో చెప్పారు.

వరిపైరు చక్కగా పండటానికి సానుకూలమున్న 50 లక్షల ఎకరాల భూమి సింహళంలో అడవితో నిండిపోయివున్నదనీ, వచ్చే 10 ఏళ్లలో తాము ఈ అడవులను ఛేదించి సేద్యయోగ్యంగా చేయటానికి 100 కోట్ల రూపాయలను ఖర్చు చేయబోతున్నామనీ, దీని విజయం తగినంత ఆధునిక యంత్రసామగ్రిని సంపాదించ గలగటంమీద ఆధారపడి వుంటుందనీ సింహళ మంత్రు లిద్దరూ నేడు ప్రకటించారు.

మార్చి 30 వ తేదీనుంచీ బ్రిటన్‌తో ప్రారంభమయ్యే సంభాషణలపైన సింహళ ఆర్థిక భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ముందు గావచ్చిన సింహళ ప్రభుత్వపు కామ్స్, ఆర్థికమంత్రు లిద్దరూ ప్రధాని అట్లీని, సర్ స్టాఫర్డ్ క్రిప్సును కలుసుకొని సంభాషించి అప్పుడే తమ కార్యక్రమంలో నిమగ్నులయ్యారు.

# నైజాం ప్రభుత్వ, పారిశ్రామిక విధానం

## మంత్రి జోషీ ప్రసంగం

హైదరాబాద్, మార్చి 23: "నేను ఆశించి అంతవరకూ హైదరాబాదీనే. అయినా కొందరు రాజకీయనాయకులు చేసే ఉద్రిక్త ప్రసంగాలను, కొన్ని వ్యక్తులు చేసే విషప్రచారాన్ని నేను హర్షించలేను. వీలు తగ్గించి వేయవలెనని కోరుతున్నాను." అని నైజామ్ ప్రభుత్వంలో పరిశ్రమల మంత్రి జె వి. జోషీ గతరాత్రి రేడియోలో ప్రసంగించాడు.

"రాజీయుతంగా విభేదాలన్నీ పరిష్కారం కావాలంటే నైజామ్ మంత్రులూ వివిధ రాజకీయ పక్షాలనాయకులూ సుహృత్ సంప్రదింపులను తిరిగి జరపటం అవసరమని నా అభిప్రాయం.

నేను మంత్రివర్గంలో చేరినది సామాన్య ప్రజానీకానికి చేతనైనంత సాయం చేద్దామనే. నేను చేరేటప్పుడు గాంధీకి అనుమతిని పొందాను. ఆయన నన్ను ఆశీర్వదించారు. నేను హృదయపూర్వకంగా ప్రజాసేవ చేస్తానని ప్రతిజ్ఞ చేశాను." అని ఆయన అన్నాడు.

నైజాంప్రభుత్వ వ్యాపార విధానాన్ని నిర్ణయించటానికి ఉపప్రధాని పింగళి వెంకటరామారెడ్డి, ప్లానింగ్ మంత్రి ఇకనుల్లా, ఆయా, కలిసిన ఒక ఉపసంఘం ఏర్పాటుచేయబడింది, మూలపదార్థాల ఎగుమతిని ఆపు చేసి తయారైన వస్తువులను మాత్రమే ఎగుమతి చేయించటానికి సాధ్యమైనంత వరకూ ప్రయత్నిస్తామని కూడా జోషీ చెప్పాడు.

# పనివాళ్లతో యజమాన్ల సంబంధాలు

## సర్ హోమీమెహతా సలహా

షోలాపూరు, మార్చి 24: అఖిలభారత నూలుపరిశ్రమ మహాసభ అయిదవ వార్షిక సమావేశ ప్రారంభోత్సవం చేస్తూ మిల్లు యజమానులు పనివారి జీవనపరిస్థితులు వృద్ధి చేయడానికి పని చేయాలనీ, కార్మికులను సోదరులుగా భావించాలనీ సర్ హోమీ మెహతాగారు చెప్పారు. కార్మికులకు విద్యాసౌకర్యాలు కల్పించడం అత్యంతావశ్యకమన్నారు. కార్మికులుపని ఎగవేయక యజమానులతో సహకరించాలని సలహా ఇచ్చారు. ఇటీవల ముడిప్రత్తిధర విపరీతంగా పెరిగిందనీ, ప్రభుత్వం బట్టల ధరల పైనా పెంచాలి లేదా ధరల కంట్రోలు పైనా తొలగించాల్సి ఉంటుందనీ లేకుంటే దొంగ క్రయ విక్రయాలు విపరీతంగా పెరిగి పోతవన్నారు.

### కార్మికుల బాధ్యత

కాన్పూరు, మార్చి 24: "ఉత్పత్తిని వృద్ధిచేయాలి. వర్గసంఘర్షణ అనే భావాలకు స్వస్తి చెప్పాలి. ప్రయివేటు పరిశ్రమలను ప్రభుత్వం ప్రోత్సహించాలి. భారతదేశంలోని అన్నివర్గాలవారూ ఏకమై అధికోత్పత్తికి బ్రహ్మాండమైన కృషి చేయాలి" అని సంయుక్త రాష్ట్ర వాణిజ్య మండలి అధ్యక్షుడు లక్ష్మీపతి సింఘానియాగారు నేడిచట జరిగిన మండలి 16 వ వార్షిక మహాసభలో హెచ్చరించారు.

# మదరాసు ధరలు

మదరాసు, మార్చి 26:

వేరుసెనగ: (581 కా 1-8 ఎక్సు కోసా గిడ్డంగులు) సెషిన్ (సేల్సుటాక్సు తోసహా) బజారు రు. 184, 186

ఆఫీసువద్ద రు.

వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (టాల్‌కోల్) (సేల్సుటాక్సుతోసహా) రు. 280-0-0 (గ్యారంటీ)

ఆముదం బజారుడెలివరి ఎక్సుపెల్లర్ సర్ ఇంగ్లీషుకాండీ 500 పౌనులు గలది రు. 850-0-0

తెంకాయనూనె (89 పౌను గల డబ్బా) రు. 17-12-9 19-12-9

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధరలు. 1-8 ఎడ్వర్డు బొంబాయి సేల్సుటాక్సుతో సహా పెల 71-14-0 సెట్లా బంగారు తులం 111-8-0 మూసబంగారు 110-0-0. సిమవెండి తులం 100-8 (రవి) 167-0-0 తులం వెండి 1-8 1-11-6.

## నూలుధరలు

మధుర మిల్లులు

| | | |
|---|---|---|
| 40 సెం | (5 పౌనులు) | రు 10-9-6 |
| 60 సెం | (5 పౌనులు) | రు 18-11-6 |
| 80 సెం | (5 పౌనులు) | రు 23-9-0 |

కోయంబత్తూరు, ఇతరమిల్లులు

| | | |
|---|---|---|
| 2" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 6-6-0 |
| 4" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 6-9-0 |
| 6½" సెం కా॥ | (10 పౌనులు) | రు 6-13-0 |
| 14½" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 14-6-0 |
| 19" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 14-8-0 |
| 40" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 21-3-0 |
| 60" సెం కా॥ | (5 పౌ॥లు) | రు 18-11-6 |
| 80" సెం కా॥ | (5 పౌ॥లు) | రు 23-9-0 |
| 80" సెం కా॥ | (10 పౌనులు) | రు 17-12-6 |
| 32" సెం కా॥ | (10 పౌ॥లు) | రు 18 0-6 |
| 36" సెం కా॥ | (10 పౌనులు) | రు 20-7-0. |

దిగుమతియైన నూలు

| | | |
|---|---|---|
| 150 'డి' జపాను | పౌను 5 కి | రు 11-12-0, |
| 120 'డి' జపాను | పౌను 5 కి | రు 12-0-0 |
| 2/150 ఇటాలి | పౌను 5 కి | రు 13-0-0 |
| 2/120 ఇటాలి | పౌను 5 కి | రు 13-12-0. |

# మద్రాసు రేడియో

## ఆదివారం మార్చి 28

మదరాసు 2: ఉదయం 7-0 ప్రార్థన 7-10 తెలుగులో వార్తలు 7-20 రికార్డులు. 8-0 ఇంగ్లీషులో వార్తలు 8-15 రికార్డులు. 8-30 తమిళకార్యక్రమం 9-0 రికార్డులు 9-10 మళయాళ కార్యక్రమం 9-30 ముగింపు.

మధ్యాహ్నం 1-0 ఆర్కెస్ట్రా 1-30 ఇంగ్లీషులోవార్తలు 1-40 రికార్డులు 2-0 వీణ 2-5 తెలుగులోవార్తలు 2-10 వీణ 2-15 ఆటవిడుపు 3 0 రేడియోనాటకము హిందీ. 4-0 పట్టమ్మాళ్ పాటల రికార్డులు 4-30 రికార్డులు 5-0 ముగింపు.

సాయంకాలం 5-30 ఆర్. కర్ణాట 6-0 ఇంగ్లీషులోవార్తలు, 6-10 స్థానిక ప్రకటనలు 6-20తమిళంలో వార్తలు 6-30 గ్రామస్థులకు 7-15 తెలుగులో వార్తలు 7-30 శ్రోతల కోరికపై 7-45 టి వి సుబ్రహ్మణ్యం ఫిడేలు 8-30 సర్దారుల 9-0 ఇంగ్లీషులో వార్తలు 9-15 ఉపన్యాసం గురించి ఇంగ్లీషు ప్రసంగం 9-30 హేర్‌బాయ్ బరోడ్కర్ పాటల రికార్డులు 9-40 మైకేల్ శ్రీనివాసమూర్తి 10-10 రికార్డులు 10-30 ముగింపు.